# త్రాగుడుపిడుగు



( నాలుగంకముల చిన్ననాటకము )



కలవటాల జయరామారావు,

కడప.



1938

# త్రాగుడు పిడుగు



(నాలుగంకముల చిన్ననాటకము)

కంచర్ల జయరామారావు,

కడప.



[illegible] పవర్ ప్రెస్, ఏలూరు.

సెప్టెంబరు 1938—1000 కాపీలు.

# తాగుడు పిడుగు



(నాలుగంకముల చిన్ననాటకము)


కలపటాల జయరామారావు,

కడప.





పట్టాభిరామా పవర్ ప్రెస్, ఏలూరు.

సెప్టెంబరు 1938—1000 కాపీలు.

# Dedication.

To

My beloved friend

Late K. B. Nata Raja Rao, B.A., B.L.,

who died on 15-2-1938 at 25th year.

Dr. K. Bhujanga Rao, L.M.P.,

G. T. Madras.

—Author.

# ఇందు వచ్చు పాత్రములు.

## పురుషులు.

1. కేశవశాస్త్రి — డాక్టరు
2. చంద్రశేఖరశాస్త్రి — డాక్టరు తండ్రి
3. దాసు — ప్రచారకుడు
4. నాయుడు — సబ్ ఇన్‌స్పెక్టర్
5. జీవన్‌లాల్ — సాహుకారు — సేట్
6. రామారావు — డాక్టరు చిన్ననాటి మిత్రుడు
7. పాపిరెడ్డి
8. మస్తాన్ రెడ్డి
9. అక్కిరెడ్డి } ఓటర్లు
10. నారపురెడ్డి — రైతు
11. కోటయ్య
12. ముస్తఫా } పోలీసువారు
13. బుడ్డేన్ సాబు — అమీనా
14. దినకరుడు — డాక్టరు కొడుకు
15. జాన్ — గంగన్న కొడుకు
16. గంగన్న
17. రామన్న
18. బోడిశెట్టి
19. కంచడు
20. కోటన్న
21. బింగోడు
22. రహిమాన్ } త్రాగుడుబోతులు
23. సోమన్న
24. నారన్న } కల్లు, సారా అమ్మువారు
25. రాముడు — దండోరావాడు

## స్త్రీలు.

26. శ్రీదేవి — డాక్టరు భార్య
27. రోజమ్మ — గంగన్న భార్య
28. సూర్యప్రభ — డాక్టరు బిడ్డ



# త్రాగుడు పిడుగు

## ప్రథమాంకము

### ప్రథమరంగము

ప్రవేశము:—దాసు అను ప్రచారకుఁడు కద్దరువస్త్రములు ధరించి జాతీయపతాకముతోఁ బ్రవేశించును.

దాసు— తే. గీ. శ్రీలతోఁ దులదూఁగి యీ ♦ లీలకడకు
భారతాంబరో! నీవడు ♦ పాట్లఁజూడ
అకట! త్రాగుడు కారణ ♦ మయ్యె దాని
మారణము జేయు రాజగో ♦ పాలునకును
సాయమును గూర్పఁ బ్రార్థింతు ♦ స్రష్టనిపుడు

ఓ సర్వేశ్వరా! ఈమహాప్రపంచమున నీవు నిర్మించిన ప్రతివస్తువు నీయొక్క మహిమను జాటుచుండ నిన్ను గొనియాడ నేనెంతటివాఁడను! జగదీశ్వరా! ఇన్ని ఖండముల సృష్టించితివి. అన్నిటికంటె మా భరతఖండమును సర్వసంపదలచే నింపితివి. మా భరతమాత తన ముప్పదిమూడుకోట్ల సంతానము సర్వసుఖముల ననుభవించుచుండఁ జూచి సంతసించునటులఁ జేసితివి. కాని యిప్పుడున్నటులుండి భారతీయులపై నిర్దయఁబూని

దారిద్ర్యదశకుఁదెచ్చితివి. త్రాగుడను మహామారిని నీవుగాక మరెవ్వరు సృష్టింపఁగలరు!

అకటా! కోట్లకొలఁది సోదరులు త్రాగుడు నలవాటు చేసికొని యుదయమునుండి సాయంకాలమువఱకు చెమటలూడ్చి సంపాదించిన డబ్బుతో తన భార్యాపుత్రులఁ బోషింపక కల్లంగళ్లకును, సారాదుకాణములకును, గంజాయి నల్లమందు మొదలగు మత్తువస్తువుల కొనఁగి చెడిపోవుచున్నారే రక్షకా! నీవావస్తువులనేల సృష్టించితివో మాకుఁదెలియదు. ఆవస్తువు లను మాత్రము మాభరతఖండమున లేకుండఁజేయుము. లేక నీమహాశక్తిచే ఆమత్తువస్తువుల మాసోదరుల కందుబాటు గాకుండఁజేయు పుణ్యపురుషుని సృష్టింపుము. నేను త్రాగుడు పిశాచమునకు లొంగకుఁడని నాసోదరులను హెచ్చరించి దాని వలన గలుగు చెడుగులను బోధించుచున్నాను. త్రాగు డును మాన్పింపఁగంకణమును గట్టికొన్న నాకు చేదోడుగా నుండుము. (అంతలోపలనుండి) అయ్యో! చంపెను చంపెను (అను స్త్రీవిలాపము వినఁబడును.) ఏమిది! ఏపాపా త్ముండో యేసోదరీమణినో పట్టి బాధించుచున్నటు లున్నది. పోయిదానిని రక్షింపబోయెదఁగాక (అని త్వరితముగ నిష్క్రమించును.)

## ద్వితీయరంగము.

ప్రవేశము:—మాలవాడలోని ఒక గృహమున రోజమ్మ తన కుమారుడగు జాక్ అను బాలునితో అన్నములేక పస్తుపడి పరుండి యుండును. అప్పుడు గంగడు త్రాగి కల్లుకుండ సారాజాడీతో పాడుచువచ్చును.

### పాట.

కల్లుకడవ నాభుజాన్నుండీ - సారాయిజాడీ సంకనయుంటె
బేమ్మల్తో నాకేమిపని-ల్యాకరాజుల్తో నాకేమిపనీ ||కల్లు||
ఫారెస్టంతా బంగారైతే - నల్లరేగడి నల్లమందైతే
లోకుల్తో నాకేమిపని మరి-లోకాలుమున్గితేమేమీ ||కల్లు||
సముద్రాలన్నీ సారాయైతే - కాలవలన్నీ కల్లూతోపాస్తే
గంగమ్మకిచ్చేను బోనం - మరి పెద్దమ్మకిచ్చేనుపోతుఱ్ఱ ||కల్లు||
కల్లుఅంగళ్లూ కనబడకుంటే - సారాయినీల్లు సాలకపోతే
లంజపిల్లుండీ యేమీసుకం - మరిలాబమొంతొస్తే యేమీపలం ||కల్లు||

మద్దత్తుగుండు నుసుగైపోతే - బంగారు చిలిమిపగిలీపోతే
సొర్గమిచ్చినా యేమీపలం - నాకు రాజ్యమిచ్చినా యేమీ పలం ||కల్లు||

సరకారోల్లు సల్లంగుండి - పోలీసోల్లునామాటింటే

యెంతతాగినా యేమీబయం - నేనెవర్ని తిడ్తే నేమీబయం ||కల్లు||

కావాల్సినంతా కల్లూబోసి - సాలేటంతా సారాయోస్తే

గొంతూలు మెల్లంగకోస్తా - నేకూనీలు యెన్నైనచేస్తా ||కల్లు||

ఈ కల్లిగ్గంలో కల్లు తాగనోనికి కవిలాసం లేదని మా గురువులయ్య సెప్పిండాడు. కాలంకొద్ది కల్లుకుగూడా కైపు తగ్గిపోతాంది. అదిగాకుండా యిప్పుడు సదివినోల్లంతా సారా యితాగబట్టి మా నోట్లో మన్నుపడింది. పూర్వం దాని సారాయి నాలుగుమడ్లకు పోస్తాండిరి. ఈ బేమ్మలు, కోమట్లు మునుగేసుకోని సారాయంగళ్లకు రాబట్టి నాల్గుదుడ్ల దాని నాలుగనాలయింది. దీనమ్మకడుపు కాలా యీ సారాయికి రాను రాను కైపు తగ్గిపోవడమే గాని యేచ్చేదిలేదు. ఇజారా తీసినోడు నీల్లు గలపటంజాస్తి అయింది. సాల్టోల్లు సారాయి అంగడికి తనిక్కిపోయే కొద్దినీల్లు గలపడం జాస్తీ అయితాంది. సాల్టుయిలాకాలో పనిదొరికితే రూపాయలకు లెక్కలేదు. వాల్లఅదుష్టమే అదుష్టం (భార్యను కొడుకునుచూచి) ఈ లంజ వూరికే పండుకున్నాదే. (అని కల్లుకడవ, సారాజాడీ లోపల బెట్టివచ్చి) లంజా నేనొచ్చేకాడికి బువ్వవండక వూరికే దున్న పోతాలె నిద్రపోతాండావా? సికింత సాయ్యేమా. నేనెవర్నైందీ తెల్దూ. (అని బాగుగఁ గొట్టుట నభినయించును.)

రోజమ్మ:—అయ్యో! చచ్చితి. చచ్చితి. అయ్యో దేవుఁడా! అమ్మో! అమ్మో! (అని గట్టిగయేడ్చు నభినయించఁగా కొడుకు భయపడిలేచును.)

జాన్:—(తండ్రియగు గంగఁడు తల్లినిగొట్టుచుండఁగా బోరుమని యేడ్చుచు అడ్డముపోయి) నాయనా! అమ్మయేమి చేసింది నాయనా. అల్లకొడతావు. అమ్మనుకొట్టొద్దు. ఆమేమెంతప్పుచేసింది. కావలిస్తే నన్ను కొట్టు నాయనా! నేను యీపొద్దు అన్నము లేకుండావుంటే ఆకలితో బడికి పోలేదు. బడికిపోంది నాదితప్పు. కొట్టు నాయనా! (అని వంగును.)

గంగ:—(కోపముతో క్రైపునభినయించి) లంజకొడకా! నా కడ్డమొస్తావా? నువు బళ్లోకిపోతే నాకేం పోకపోతేనాకేం! నేనేమైనా నిన్ను పొమ్మన్నానా? (అని తూగుచు కాలితోఁదన్నఁగా జాన్ క్రిందఁబడి లేచి) అయ్యో! (అని యేడ్చుచుండును.

ప్రవేశము—దాసు.

పాట.

దాసు:—రండు హరిజనులార మీరూ
బయలుచేరండోయీ నాతో బయలు
ఆలూబిడ్డల కన్నమిడక

కల్లు దాగి చావనేలా
తెలిసి తిరగండోయ్॥ రండు॥
కోట్లకొలఁదీ భారతీయులూ
పూటగంజికి లేక చావా
కల్లుదాగుట న్యాయమునునా
కల్లుమానీ భరతమాతా
సేవఁజేసిన పుణ్యమబ్బును.॥ రం॥

హరిజనులను మాలలని సంఘమునకు దూరమిడి వారిని అన్యాయముగ నాశనము గావించుచున్నారు. వారికి విద్యా బుద్ధులు గరపి మన సోదరులవలె ఆదరించిన మన హిందూ సంఘము మరింత బలముగలదై యుండునుగదా. ఈ త్రాగు బోతు తప్పత్రాగి తన భార్యాపుత్రులఁ గొట్టుచున్నటులున్నది. పాపము వారికి అడ్డుపోయి కొట్టకుండ జేసెదగాక (అని గంగ నినిసమీపించును.)

గంగ:—(తనలో) ఈ స్వదేశమోల్లు యాడికిపోయినా పిల్లాల అడ్డమొస్తాంటారు. ఈతేగాడేంటికో నాయింటికాడి కొస్తాం డాడే రానీయవుగూడదు తాల్ (అని కొంచెము ముందు కువచ్చి) ఎవరయ్యా! నీవు గాంధిటోపోళ్ళకు చేము బిచ్చం పెట్టంపో. యాడికొచ్చినా మీ పాడుగుంపు యిడిసేటుగా ల్యావు. కల్లంగటికాడా. మీరే. కటికంగటికాడా మీ రే

సారాయికిపోతే ఆడా మీదరశనమే. చీమలపుట్ట పగిలినట్లు తెల్లంగటోపీ బెట్టుకొనేది యేమిలావుకున్నా చేతజంపా బట్టుకుండేది తిరుగుతాండేది. పోలీసోల్లు మిమ్మాలమెంత గొట్టినా కాని రావంతన్నా బయంలేదేమయ్యా? నాకేబువ్వ ల్యాక చచ్చాండ కట్టంచేసిచేసి మెంకలిరగొట్టుకోని యింటి కాడికొస్తే బువ్వకు గతిలాకుండావుంది. గూనికి తోడు దొబ్బుడు వాయువొచ్చినట్లు బువ్వల్యాక నేనుచచ్చాంటే వ్యాకనివి బాగొచ్చినావు మా పానం మీదికి. ఈలంజ (అని కాలితో తన్ని) వూరికే యింట్లో కూకోని బువ్వన్నా తగిలెయలా. దీనికి నీవైనా కాసంతబుద్ధిచెప్పు మూతాం.

దాసు:—నాయనా! నేను బిచ్చాకినిరాలేదు. భయపడకు. ఎవరో గొల్లున యేడ్వంగావిని, యేయపాయము జరిగినదో యనియు, చేతనైన సాయముచేయుదమనియు వచ్చినాను.

రోజ:—బాబూ! నాప్రాణాల దీసిండాడుచూడండి. తప్పాతేందే నన్నుకుక్కను గొట్టినట్లు కొట్టినాడు.

గంగ:—(ఈయన ఆసరా వుండాడని యింక అగాయిత్యం చేస్తాదేమో అని తనలో యనుకొనును.)

దాసు:—ఏమి నాయనా! ఆమె నీ గృహలక్ష్మియే. ఊరక యేలఁ గొట్టితివి ?

గంగ:—ఏందయ్యా! ఓ-హాో-హాూ బలేబాగుంది. నీవుకూడా దానిలోనే జేరుకుంటివే? అడోల్లను జూస్తే యెవరికైనా రోగం పుట్టదేటే:-అదికాదయ్యా! నేనింటికొచ్చేకాడికి బువ్వావండంది యెవరితప్పంటావు?

దాసు:—ఏమిటితల్లీ! భర్తవచ్చునప్పటికి వంటజేయుట నీ పనికదా? ఏలఁ జేయకపోతివి?

గంగ:—అడుగు. అట్లడుగు సావిూ! దీనిరంగం బయటబడ్తాది.

జాన:—(నిర్వారపాటున జరుగు సంతులఁ జూచుచుండును.)

రోజమ్మ:—(దుఃఖముతో) బాబూ! ఇంటిలో ఒక గింజలేదే. నన్నెట్ల వంటజేయమంటారు. సంపాదించినడబ్బు కల్లంగడికిఁ దగులఁబెట్టి, వట్టిచేతులతో వచ్చిన నేనేమి వండగలను?

జాన:—(లోపలికిఁ బరుగిడి కల్లుకుండనుదెచ్చి మిూరేచూడండి బాబూ! ఎంతకల్లు తెచ్చిండాడో. (అని క్రిందఁబెట్టి చూపును.)

గంగ:—దొంగలంజకొడకా! ఎవరు తెమ్మనిరిరా? (అని పైఁ బడఁబోవును.

జాన:—బాబూ! (అని దాసు వెనుకదాగును)

దాసు:—(అడ్డముపోయి గంగనిని ఆపి) నాయనా! ఇది ఆమె తప్పుకాదు. మగవాఁడవై పుట్టి నందులకు కష్టపడి సంపాదించి ఇంటికిఁ గావలసిన వస్తువులను దేవలసినపని నీది.

ఆవస్తువులను నోటికిరుచిగావండి నీకుబెట్టిఆవలభుజింపలవసిన పని యీమెది. అటులఁగాక డబ్బంతటిని కల్లంగడికి దార బోసి వట్టి చేతులతోవచ్చి, ఆమెను వంటజేయులేదని కొట్ట వచ్చునా? దీనిని దేవుఁడు చూచి ఓర్వఁగలఁడా?

గంగ:—అదికాదయ్యా! నేను నిన్న అర్ధరూపాయ తెచ్చి యిచ్చింలే, పిల్లోనికి పుచ్చకం, పలకకొని యిచ్చిందంట. దానికి గింజలు తీసక రాగూడదు. ఇది తానుమతంలో జేరిందిగాక. పిల్లోన్నిగూడ మతంలో జేర్పిచింది. అది కాక-ఆ-ఆ-పిల్లోన్ని బడిచదువుకు పంపుతాంది. (పిల్ల వానిని జూచి) ముందరిజుట్టు బెట్టుకొని నిలబన్నాడు చూడు. జానెడులేదు. యీనికప్పుడే ముందరి జుట్టుకటి? (దాసును జూచి) మరి-ఈ-మాలలకు చదువెందులకయ్యా? మే మేమన్నా బాపనోల్లమూ చదివేదానికి.

దాసు:—నాయనా! మీరు మాలలుగారు. శ్రీభారత మాత ధరించిన స్వర్ణపుష్పమాలలు. గాంధీమహాత్ముని కంఠ మాలలు. మహాపురుషుఁడగు ఏసునాథుని కంఠముననుండు గులాబిమాలలు. మహమ్మద్ సమాధిపైఁగప్పబడిన మల్లె పూలమాలలు. చదువు బ్రాహ్మణులే కాదు. అన్నిజాతుల వారును, అన్నిమతముల వారును చదువవచ్చును. చదు వనివాఁడు దున్నతోసమానము. కనుక నీకొడుకును బడికిఁ

బంపినది ఆమెతప్పుకాదు. మతములోఁ జేరినదియుఁ దప్పు కానేరదు. అన్నిమతములవారికి ఒకఁడే దేవుఁడు. కడకు అందఱును ఒకే దేవునిఁ జేరఁబోవలసినదే. తెలివిలేని మూర్ఖులు తప్ప యితరులు మాదేవుఁడు వేరని, మీదేవుఁడు వేరని తగవులాడరు. కనుక యిప్పుడు తప్పంతయు నీపై తేలినది.

గంగి:—ఎందుకయ్యా! నీవు బలేబాగుండావే. సరేసరే. వచ్చి, చాంచేపైది. ఇంకపో నీ శీరంగనీతులు చాలిచ్చి.

దాసు:—నాయనా! నేను పోవుటకు రాలేదు. నిన్ను నావెంటఁ దోడ్కొని పోవుటకు వచ్చితిని.

గంగి:—ఏం-పోలీసోళ్లకు పట్టిచ్చేదానికా? నీగాంధిటోపి పై కెగిరిపోతాది బద్దరం! నేనెవరైంది తెల్దేమో-పో.

దాసు:—నాయనా! కైపుపట్టరాదు. అందువలన నష్టము చాలయున్నది.

గంగి:—ఏందిసామీ! అంతఅబద్ధమా కల్లు సారాయి తాగితే నష్టమైతేయిప్పుడు యింగ్లీసు చదివినోళ్లు, యీ దొర్లూ, మరీకొందఱు బేమ్మలూ వగైరా వగైరా ఆడోళ్లతో కాన్నుంటీ తాగుతాండారే? వాళ్లకు తెలకనా-అంట?

దాసు:—వారుకూడ నీయట్టివారే. కులహీనులుసుమా! వారు త్రాగిరని నీవుకూడ త్రాగరాదు.

గంగ:—గొప్పోల్లకే లేనికులం మాకొచ్చిందా. కులంగిలం కలిగ్గింలో అంతా కల్సిపోయ్యింది. అట్లకావాల్నని బెమ్మం గారి వాక్యాలు పలికినాయ్. నీదేందో పోవయ్యా.

దాసు:—ఆమాటలతోను వాగతోను మనకక్కరలేదు. త్రాగుడు తప్పుసుమా.

గంగ:— తప్పుపని అయితే మనమేలుగోరే సర్కారోడు యిజారా యెందుకిస్తాండాడు?

దాసు:—అందుకే సర్కారువారు ధరయెక్కువజేసి త్రాగకుండఁ చేయుచున్నారు.

గంగ:—ఏందయ్యా మీయెర్రి! సదివినోనికన్నా సాకలోడు మేలనే దిందుకే. దరయెక్కిస్తే తాగేది మాంతారా? ఎన్నటికీమానరు. దరయెక్కువైతే దొంగతనాలు, కూనీలు యెక్కువై పోతాయ్. ఈపకారం రాసియ్యమంటే రాసిస్తా.

దాసు:—దొంగతనముచేసిన పోలీసువారు పట్టి శిక్షింతురు. కూనీచేస్తే గల్లుకేస్తారు.

గంగ:—మీమాటమీదే. ఆరాయికయినా చెప్పొచ్చుగాని నీకు జెప్పేది బోకష్టంగావుందబ్బా. ఈసారాయి కల్లంగళ్లు యెందుకు సర్కారోడు పెట్టిస్తాండాడో మీకుతెల్సునా? నేనన్నా చెప్పుతా తెల్సుకో. పోలీసోల్లు, సాల్టోల్లు బతక

టానికి. కజానాలోనిండేదానికి. మాముండల్ మోసేదానికి. సర్కారోళ్లు జోక్యం కలుగ జేసుకోకుంటే మాయిట్ల పకారం కల్లుగీసుకోంటాం. సారాయివండుకోంటాం. చేలన్ని బంగారు పైరు బెట్టుకోని సుకంగా వుండం. మాడబ్బు మాకాడనే వుంటాది. లెక్కదండిగా వుంటే దొంగతనా లెందుకైతాయ్? కూనీలెందుకు జేస్తాం?

దాసు:—అదిగాదు తండ్రీ.

గంగ:—ఇంగేదితండ్రీ! నాకంట్లో కలికమేసి పోదామను కున్నావా?

దాసు:—వినుమునాయనా! నీతో త్రాగుడు మాన్పించి త్రాగ కూడదని యితర త్రాగుడుబోతులకు బోధించుటకై నాకు సహాయముగాఁ బిలుచుకొని పోదలఁచితిని. నామాట వినవా?

గంగ:—నాలెక్కపెట్టి నేను తాగుతా. నిన్నేం అడగంలే. ఇంకపో.

జాన్:—అవును బాబూ! మా బడిలోకూడా కల్లుసారాయి తాగ్రాదని చెప్పినారు. అటువంటివారి దగ్గఱకుఁ బోరా దంట.

గంగ:—ఆ-ఆ- (తలనాడించుచు) నాకు తెల్సు, ఇది బళ్లోకి పోయిండానికి గుర్తా. బళ్లో యిట్లాటిమాటలు నేర్పొద్దని

సెప్పాలె. ముందుఅయ్యోర్రిపనిపడ్తే అన్నిరోగాలు కుదు
ర్తాయ్. ఈయిసోళ్ల నన్నిటినీ తీసెయ్యమని సర్కా
రోళ్లకు అర్జీపెడ్తే బాగుంటాది.

దాసు:—గంగన్నా! (అని మీఁదచేయివేసి తట్టును)

గంగఁడు:—ఏమయ్యా! అంటరానోన్ని నన్ను తగిల్తివి?

దాసు:—నాయినా! తప్పులేదు. నీవు అంటరానివాఁడవు
కాదు. హరిజనుఁడవు. మరి-నీవు దినమున కెంత సంపా
దింతువు?

గంగ:—ఒకరూపాయి సంపాదిస్తా గనుల్లో ఱాళ్లు మోసిమోసి
కష్టపడి సంపాయిస్తాండా.

దాసు:—నీయింటికర్చు ఎంత అగును?

గంగ:—అర్ధరూపాయి.

దాసు:—అర్ధరూపాయిని నీ భార్యకిచ్చుచున్నావా?

గంగ:—నాకుతాగేదానికె ముప్పావలా కావలె. పావలా
పైకర్చు దేవుఁడుసెప్పిండే.

దాసు:—మరిరూపాయి. నీవే కర్చుపెడితే నీభార్యాబిడ్డలగతి
నీ అన్నమునగతి యేమికావలెను?

గంగ:—ఏమి చెయ్యమంటారు సామీ అంతకష్టంచేసి తాగక
పోతే జేపే చచ్చిపోతా.

దాసు:—నాయనా! అంతకష్టపడి సంపాదించిన డబ్బుతో కల్లుత్రాగి నీవు అన్నములేక కృశించుటయేగాక పాపము భార్యను పుత్రుని పస్తుపెట్టి చంపుచున్నావే. మత్తుచే నీకాకలి చచ్చియుండును. వారికడుపు మలమల మాడి పోవుచుండఁజూచి యెటులసహింతువు. నీది ఱాతిగుండె సుమా! కొంచెమైనను కనికరములేదా? నీవు కల్లుత్రాగిఅన్నము తినకుండ జీవింపఁజాలవుకదా అన్నముతిని కల్లుత్రాగ కుండ మనమెంతకాలమైన జీవింపవచ్చునని నీకు బాగుగాఁ దెలియును. అన్నములేక మలమల మాడునది నీభార్యా బిడ్డలేకాదుసుమా. కోట్లకొలంది మన సోదరీమణులు అన్నమో అన్నమోయని చచ్చుచున్నారు. కోటాన కోట్లధనము నాశనమై దాని మూలమున దేశము నానా టికి క్షీణించి పోవుచున్నది. నీపాదములఁ బట్టి (అనిచేతుల జోడించి కూర్చుండి) వేడికొందును. త్రాగుడుమాని నా వెంటరమ్ము.

గంగ:—(తనలో) అవునునిజమే. తాగకుంటే బతకలేనా కష్ట పడి రూపాయ పనిచేసివృథా కల్లంగటికిచ్చే దానికంటె, సులభముగా అర్ధరూపాయే సంపాదిస్తా అదేచాలు (ప్రకాశముగా) సరేసామి దేవునిసాచ్చిగా నేనుతాగనుపో.

దాసు:—అదికాదు-(అని తనకద్దరు సంచినుండి తీసి ఒక కద్దరు నిక్కరు ఒకచొక్కా, ఒకటోపీనియిచ్చి ధరించినతరువాత

చేతికి జండానిచ్చి) రమ్ముపోదము. తాగవలదని మన హరి జన సోదరులకు బోధింతమురమ్ము.

గంగ:—నేనెందుకుపోసామీ! ఎదో పనిజేసుకోకపోతే నా పెండ్లాం కొడుకుగతి యేలాగు? నేను పనికిపోతాపోసామీ.

దాసు:—అదికాదు గంగన్నా! నీభార్యకొక చేతిరాట్నము యేకులను యిప్పించెద. ఆమె నూలువడికి గాంధీసేవా సదనమున యిచ్చినచో దినమునకు నాలుగణాలిత్తురు. నీపుత్రుని సేవాసదనమున జేర్తును. అక్కడ అన్నవస్త్ర ములనిచ్చి చదువు, మరియు ఏదైన చేతిపనిని నేర్పింతురు. నీవునావెంట ప్రచారము జేయుచుండుము. నీకు అన్నము నకు తక్కువలేదు. చాలదా.

గంగ:—మంచిదిసామీ!! (యోచించి) మరి ఈ దేపు యెల క్షన్ జరుగుతుందంట. నారాయణరెడ్డి పార్టీవాల్లు సారాయి కల్లు మరి మాంసంతోగూడా అన్నంపెట్టిస్తామని ఓటు యిచ్చేటోల్లను పిలుచుకొనివస్తారంట. కొండార్డిపార్టీవాల్లు ఉత్తభోజనం పెడ్తామంటే యెవరువచ్చేటుగా లేరని అను కుంటాండారు. మనంపోయి తాగేదిమంచిదికాదని బోదిచ్చి ఓట్లను కొండార్డికే యిప్పించాం పాండిసామీ! (కల్లుకడవ నుజూచి) సామీ! ఈపాడుకడవ యింట్లోవద్దుసామీ పగులగొట్టివస్తా (అని పగులునట్లు పారవేయును.)

దాసు:— సీ. గడియించుధనమెల్లఁ ♦ గల్లుముంతలకిచ్చి
సతి సుతులఁగొట్టు ♦ చవటలార !
తప్పఁద్రావియు మఱి ♦ దప్పుబజారులఁ
బడిదొర్లుచుండెడి ♦ మంములార !
సీమవిద్యలనేర్చి ♦ సీమసారాఁగ్రోలి
చెడిపోవుచుండెడి ♦ చెనటులార !
బ్రాందిబుద్ధినిజూపఁ ♦ బ్రిల్లదంబులఁబల్కి
వెనుకంజవేయని ♦ బేలలార !

తే. గీ. జరుగుసంగతి జెప్పెద ♦ మరలవినుఁడు
త్రాగిసుఖమందు వారలీ ♦ ధరణిలేరు
బ్రతికెనేనియుఁ బీనుఁగు ♦ భాతియగును
ధనము మానంబుప్రాణంబు ♦ దరలునయ్య !

గంగడు:—పాట: కల్లుకొట్టాలు కాలిపోతే - సారాయంగళ్ళు నమసిపోతే
కడుపునిండకూడుగలిగేని - మనడబ్బంత మన కేనిలిచేని.

(నిష్క్రమించును.)

ఇది ప్రథమాంకము.

---



# త్రాగుడుపిడుగు.

## ద్వితీయాంకము.



### ప్రథమరంగము.

ప్రవేశము - మాదిగెరాముడు దండోరా వేయుచు వచ్చును.

రాముఁడు:—(తప్పెటవాయించి నిలిపి) అయ్యా! నారాయణ రెడ్డిగారికిఓటిచ్చేటోల్లంతా ఆయనదగ్గరికి పోయి చీటియిప్పిచ్చుకోని కల్లుసారాయంగళ్ళలో చూపితే కల్లూసారాయి తాగినంతా వూరికే పోస్తారు. ఆనక సత్రంకాడికి పోతే మాంసం పాళంతో భోజనం పెడ్తారు. బోంచేసి రెడ్డిగారికి ఓటేసి మీావూర్లకు పోండయ్యా! (అని తప్పెట వాయించి పోగా తెరలేచును.)

ప్రవేశము-ఓటర్లంతా చీట్లుబట్టికోని రెండువరుసలుగా కూర్చుండియుందురు.

పాపిరెడ్డి:—నారాయణరెడ్డి అంటే దేశాలకు పేరెక్కినోడురా. చూడర్రి కల్లూసారాయికి చీట్లు యేమిస్తాండాడో మానుబావుఁడు డెబ్బైయెదు పొట్టేల్లను యాభై మేఁకలను నూరుకోళ్ళను కోసి బానలతో వండిచ్చి

నాడంట మనకోసం. అతగాడుండ్లా కొండాడ్డి బాపనోళ్ళ పావాసంపట్టె, సొదేశంగుడ్డలుకట్టుకోని ఓటెయ్యమంటే యెవరిస్తారోయ్. కల్లు సారాలు అనేటప్పటికి ఓట్లు దుంకు తాయనే సంగతి అతగానికి తెలియలా. ఉత్తబువ్వ మనం దినం యింట్లో తినడంలా. కల్లు సారాయి మాంసా లతో భోజనం పెడ్తాంటే, నారాయణరెడ్డి కియ్యక, అతని కిస్తారేమోయ్.

మస్తాన్ రెడ్డి:—ఆతగాని కెవరిస్తార్లే. పాపం యిన్నిజీవాలను పెద్దమ్మకు బలియిచ్చినట్లిచ్చి, వంటచేయించి మనకు పెడ్తాంటే కొండాడ్డిమొట్గాపోతే మనకేం పోసీ.

అక్కిరెడ్డి:—నారాయణరెడ్డికీ జై! (అని అరువఁగా అందరు జేజే శబ్దము గావింతురు.)

ప్రవేశము!—దాసు, గంగన్న పాటపాడుచు వత్తురు.

రండు రైతువీరులారా
బయలుదేరండోయి, మాతో బయలు
కల్లు దాగివి ఓటు నియ్యా
కూడదిటు రండోయి బాబూ
లేచి యిటు రండోయ్॥ రండు॥

రైతుసోదరులారా! మీచేతులారా మీగొంతుకోసి కొనే దానికి తయారగుచున్నారు. మీరు కల్లు సారా

మాంసానికాసించి ఓటు యిచ్చు రెడ్డిగారు, దేశానికిఅందునను మన రైతులకు యేలాటి సాయము చేయఁగలఁడో మీరు యోచించినారా? అతఁడు మహాత్రాగుబోతు. అందుచేతనే మిమ్ములను గూడ త్రాగుబోతులగా మార్చేసే దానికి బూని కొసయున్నాఁడు. కొండారెడ్డియన్ననో చాల నీతిపరుఁడు. దేశానికై తన డబ్బంతయు కర్చుపెట్టుచున్నాఁడు. పనులు లేని రైతుబిడ్డలకును స్త్రీలకును పనులు గల్పించినాఁడు. అతనిని గురించి చెడువార్తలు మీరెచ్చటనైన విన్నారా? అతఁడు ధర్మమే జయించుననియు, తాను రైతులకొఱకు పాటుపడ నిశ్చయించి యుండఁగా రైతు లెన్నటికిని తన కపజయము కలిగింపరని రైతులగు మిమ్ము నమ్ముకొని యున్నారు. ఇపుడు ఓటుది ముఖ్యముకాదు. కల్లు సారాయి అను పిశాచములను మీకొసఁగి మీతో ఓటును లాగుచున్నారు. అట్టివానిని మీరు ప్రతినిధిగా నెన్నుకొన్నచో మిమ్మందఱను త్రాగుబోతులుగా మార్చి నాశనము జేయును. ఈ త్రాగుడు వలన మీకు గౌరవము రానేరదు. మీరు త్రాగునది కల్లు, సారా కాదు.

తే. గీ. ఆలుబిడ్డలు అన్నమో • యనుచు నేడ్వ
కనికరములేక సారాయి • కల్లు పేర
త్రాగునది వారి రక్తమే • దాని వలన
ధనము మానంబు ప్రాణము • తరలు వినుఁడు.

కోట్లకొలది ధనము పరదేశీయులపాలై పోవుచున్నది. కోట్లకొలంది స్త్రీలు పురుషులు అన్నమో అన్నమో యని వాపోవుచుండ మీకెటుల నిదుర వచ్చుచున్నది? మీకుండే తాలిగుండెయా, ఈ దినము త్రాగినంతనే మీయాశతీరునా? ఈదినము ఓటిచ్చి రేపు అతని తలవాకిటఁ దొంగిచూచినచో మెడబట్టి గెంటించును సుమా. సారాకు ఓటిచ్చి రైతు సోదరులకందఱకు విషము బోయకుఁడు! ఇందు త్రాగుడు మానితిమని బాసజేసి, దేశమునకై పాటుపడు మాకొండారెడ్డికే ఓటుజేయుదుమని ప్రతినబూనుఁడు. భారతమాతకీ జై అనుఁడు.

గంగన్న:—ఏమి రెడ్డిగారూ! ఆ మానుభావుఁడు చెప్పేది అర్థంకాలేదా. కల్లులో మునిఁగి తేలే నేను తాగేది మానింటే మీకు మానలేరూ. కల్లుతాగేది చాలిచ్చినప్పటినుండి నాపెండ్లాం, కొడుకు సుఖంగావుండారు. నా సంతోషమే సంతోషం. రాండయ్యా! సిగ్గుల్యాక కల్లుకు కనిపెట్టుకొన్నారు.

అందఱు:—రా! రా. ఈపాడుకల్లుకై ఓటు వృధా యెందుకు చెయ్యాలె. మూఁడుముడ్ల కల్లుకై మనం ఆశించరాదు. ఆయన చెప్పేదంతా నిజమే. రండి పోదాం! (అని దాసు గారి వెనుక బయలుదేరుదురు)

పాట

కల్లుకై ఓటియ్యుమయ్యా
కల్లుమానితిమీ మేమూ కల్లు॥
ఆలుబిడ్డల మంట గలిపి
కల్లు మానితిమయ్యా మేమూ
కండ్లు తెరచితిమీ॥ కల్లు॥

---

## ద్వితీయరంగము.

ప్రవేశము:—చంద్రశేఖరశాస్త్రి మరణావస్థలోనుండ కోడలు శ్రీదేవి పరిచర్యఁ జేయుచుండును. దినకరుఁడను బాలుఁడు, సూర్యప్రభయను బాలిక ప్రక్కనసుందురు.

చంద్ర:—(మంచముపై బరుండి హీనస్వరముతో) అమ్మాయీ! కేశవుఁడు మనకిఁక బనికిరాడమ్మా. తప్పదారిని తప్పుడు మందులిచ్చి డాక్టరుపనిని బోఁగొట్టుకొనెను. ఇంటిలోని సొత్తంతయు ముగించెను. నాకు దెలియకుండ భూములన్నిఁటిని విక్రయించినాడు. ఏబదివేల యాస్తి నాశనమాయెను. ఇఁక బ్యాంకులో యిరువదియైదువేల రూపాలుంచినాను. ప్యాసు పుస్తకమును చెక్కుపుస్తకమును బీరువలో దాచినందున అదియైనను నీకు దక్కినది. అందులోఁ

గొన్ని చెక్కులపైన సంతకముచేసియుంటిని. నేను త్రాగు
కుడునో బ్రతుకనో నీవాచెక్కులద్వారా ఆడబ్బంతయు
దీసి బిడ్డలపేర వేయుము

శ్రీదేవి:—మామగారూ! నాయదృష్ట మిటులున్నది. నాకు
తెలిసి నేనే పాపమును గావించియుండలేదు. పూర్వజన్మ
పాపఫల మీరీతిబాధించుచున్నది. ఎన్నివిధముల త్రాగుడు
మాన్పింపఁదలచినను నాచేత గాకున్నదిమామయ్యగారూ.

చంద్రి:— (ఆయాసముతో మెల్లఁగా) అమ్మాయీ!
వాఁడు పనికిరాడని నాకెప్పుడో తెలియును. అందులకే
ఆత్రాగుడు బోతును మరచిపోయినాను. ఏమిలేదమ్మా
ఈబిడ్డలఁజూచిన, నాహృదయము - అయ్యో రగులుకొని
పోవుచున్నదమ్మా, వీరి నెటులఁగాపాడెదవో నీయిష్టము.

శ్రీదేవి:—మామయ్యా, నావిషయము బిడ్డలవిషయము
మీరు దిగులుపెట్టుకోరాదు. ఈలాగు దుఃఖపడి మన
స్సుకు కష్టం తెచ్చుకుంటే జబ్బు యెక్కువౌతుంది. మీరు
విశ్రాంతి పుచ్చుకోండి, బిడ్డలను పాటపాడమంటానువినండి.
అన్నియు మరచిపోండి (బిడ్డలఁజూచి) దినకరా! ప్రభా!
మీబడిలో నేర్పిన పాటనుపాడండి. తాతగారు వింటారు.

దినకరుఁడు:—పాటపాడితే మాకేమిస్తారమ్మా, మాకు చెరి
ఒకరూపాయిస్తే పాడాము.

చంద్రి:—నేనిస్తాను ఆడబ్బు యేమిచేస్తారమ్మా.

సూర్యప్రభ:—కలెక్టరుగారు కల్లుసారా త్రాగకుండా చేయాలని త్రాగుడు బోతులకు త్రాగరాదని బోధచేయడానికి కొందఱను పంపుతారఁట, వారి కర్చులకు కొంతడబ్బు కావలసియున్నదఁట. అందునిమిత్తం ప్రతివాఁడు తోచినంత సహాయము జేయుచున్నారు. మేము చెరిఒక రూపాయి యిస్తామనుకున్నాం తాతయ్యా!

చంద్రి:—చాల మంచిదమ్మా నేను తప్పక మీఅమ్మచేత రూపాయలిప్పింతును. నేను లేవలేను, నేను బ్రదికేటికూడా అనుమానమే. మీపాటవిని ప్రాణము విడుతును. ఆపాపి త్రాగుడే మనకొంప తీసింది.

దినక:—అట్లైతే మేం పాడం పో మేము పాడితే నీవు చస్తానంటావే.

ప్రభ:—నీవు చావొద్దు తాతయ్యా.

చంద్రి:—మీరు పాడినను చత్తును లేకున్నను చత్తును. అమ్మాయీ! వారిని పాడుమనుము. ముందుగనే వారికి రూపాయలనిమ్మా.

శ్రీదేవి:—(బిడ్డలతో) తాతయ్యగారు చావరమ్మా తాతయ్యగారిమాట మీరతగదు. దినకరా! నీవు మొదలుపెట్టుము.

పాట.

దేవ:—జయమహా! వందే భారతమాతా! ॥జయ॥

ప్రభ:—వర్ణవిభేదము కలగకపోతే

అంటుదోసము అడుగంటినదో

హిందుముసల్మాన్ మైత్రి కలిగినా

దుఃఖమికేలా భారతమాతా

సర్వము నీదే హిందూమాతా ॥జయ॥

సోదరుఁడా!

సహోదరీ!

మీరిపుడే దీక్షను గైకొనుఁడీ!

మాలలమానము గావఁగరండీ!

త్రాగుఁడు మాన్పఁగ దీక్షబూనుఁడీ

మాలలు శ్రీహరి మాలలువినుఁడీ

హరిజనసేవయె హరిసేవనుఁడీ

భారతజననీ కోరికవినుఁడీ ॥జయ॥

(పాట ముగియుచుండఁగనే)

(ప్రవేశము అమీనాబుడ్డన్‌సాబు, సౌకార్ జీవన్‌లాల్ జప్తుచేయుటకు వత్తురు.)

బుడ్డన్:—అయ్యా! సామీ! మారాజ్! (అనిపిలుచును)

శ్రీదేవి:—(ముందుకు వచ్చి) ఎవరు నాయనా.

బుడ్డన్:—నాదీ పేరు అహోనా బుడ్డన్ సాబ్. ఈయన సౌకార్ జీవన్ లాల్.

శ్రీదేవి:—ఏమి నాయనా! మాతో మీ కేమి పనియున్నది.

బుడ్డన్:—డాక్టర్ నై క్యా అమ్మా.

శ్రీదేవి:—వారిపుడు యింటికే వచ్చుటలేదు. ఏమిపని ఉన్నది.

జీవన్:—బోల్ రే. నీకీ యేం భయంవుందీరా!

బుడ్డన్:—క్యాబీనై అమ్మా (అర్థోక్తి)

జీవన్:—అరే యేమీ నొందుక్ నై?

బుడ్డన్:—ఉంమా మారాజ్! (శ్రీదేవినిజూచి) డాక్టర్ నాయనా వుండామా లేదా.

శ్రీదేవి:—ఆయన చాల జబ్బుతో నున్నాడు. చక్కగ మాటాడుటకూడ లేదు.

జీవన్:—అరే మరాతో అంతాపాతాదిబే. కరోరే. జల్దీ కరోరే. (అని పదిరూపాయలనోటు యిచ్చును.)

బుడ్డన్:—అమ్మా! ఇల్లుభూముల్, సామాను గీమాన్ అంతా జప్తిచెయ్యాలని కోర్టువారి ఉత్తర్వు అయింది. మీ రంతా బహార్ నికల్ నా.

శ్రీదేవి:—(దుఃఖముతో) దైవమా అయ్యా! ఎంతకు డిక్రీ అయినది.

జీవర్:—ఎంతహాయి తే నీవు యిస్తావ్. ఇరవై యెదు వేలకి డిక్రీ అయింది. జప్తిచేస్తే యేమైనా వుండాదో లేదో.

శ్రీదేవి:—కొంచెమాగుడు. (మామగారిని సమీపించి) మామగారూ! మీరాడుకు చేసిన యప్పులకు జప్తుచేయుటకు వచ్చినారు. ఇరువదియైదు వేలు కట్టవలెనంట.

చంద్ర:—(ఆయాసముతో) అయ్యో పాపీ! కడకెంత పనియాయెనమ్మా. ఇపుడు జప్తుచేసిన ఈస్థితిలో మనము నిలుచుటకైన చోటు లేదే. ఇంతపోయినది ఉన్నదికూడ పోనిమ్మా. ఆచెక్కు పుస్తకములో ఒక చెక్కుతీసి ఇరువదియైదు వేలకు చెక్కునిమ్మా. దానితో మన పని సమాప్తియగును.

శ్రీదేవి:—(లోపలికి వెళ్ళి చెక్కుపుస్తకమును తెచ్చియిచ్చును)

చంద్ర:—(తెరచి చూచి) అమ్మాయీ! సంతకము చేసిన చెక్కు లేమాయెనమ్మా.

శ్రీదేవి:—నే నెఱుఁగను మామయ్యా! నెల క్రిందట ఆయన వచ్చినపుడు బీరువతీసి చూచుచుండిరి. ఆ—ఆ—అపుడేమైన—

చంద్ర:—(చెక్కు పుస్తకమును) పారవేసి హా! (అని మూర్ఛపోవును.)

శ్రీదేవి:—అయ్యో! మామయ్యా! పలుకరేమి-అయ్యో!

జీవర్:—జప్ను కరోరే. దేరీచేస్తే హంతా పోతాది.

బుడ్డన్:—క్యామా. బహార్ నికలో. చెప్తె తెల్వీలేదూ. పోతార్ లేదూ.

శ్రీదేవి:—భగవంతా! ఎంత జేయుచున్నావు. నీ పరీక్షకు నేనే దొరకితినా? అయ్యో! ఈ పాపి త్రాగుడు యెంత చేసెను. మంగళసూత్రము తప్ప నాకిక యితరమేమియు లేదే. నగలన్నింటిని ఆయనకే సమర్పించితినే. బిడ్డలకు చింతాకంత బంగరు నగలేదుకదా? ఒకటా పదా ఇరువదియైదు వేలు మేము తీర్పగలమా. నా భర్త సమయమునకు లేడు. మామగారు మరణావస్థలో నున్నారు. ఇంతవఱకు ఒక్కరము నోట గంగయైనను బోయలేదు. బిడ్డలకు అన్నముజేసి పెట్టనొంచియుండ మాకీ కర్మము ప్రాపురించెను. అయ్యో! ఈ త్రాగుడు ఎన్నడు నశించునోకదా. హిందూ మహామ్మదీయులలో నావంటి యువతులెందరిట్టి యగచాట్లకుఁ జిక్కి పరితపించుచుండిరో గదా! సర్వేశ్వరా! మాకిప్పుడేదిదారి.

బుడ్డన్:—ఏమీ అమ్మా! సెప్తే తెల్వీలేదూ. బయటికి వస్తారూ లేదూ.

శ్రీదేవి:—అయ్యో! ఇంకొక వారము దినములు జరిగిరండు. మామగారికి జబ్బు కుదరగనే మరియొకచోటికి వెళ్లుదుము.

జీవన్:—అరే. ఆమాటల్ పనికిరావ్. డకల్ రే (అని అయిదు రూపాయల నోటు నిచ్చును.)

బిడ్డలు:—అయ్యో! మేమూరక పాటపాడ్తాము. పోతారా? తాతయ్యకు జబ్బు కుదిరినాక రాండి.

బుడ్డన్:—అది కామూ నూ-పట్టు-అయ్యాకిబయటా పెడదాం.
(అని జీవన్‌లాల్ బుడ్డన్‌సాబు చంద్రశేఖరశాస్త్రిని వెలుపల నేలపై (బరుండ(బెట్టుదురు)

శ్రీదేవి:—(బిడ్డలతో మామ ప్రక్క-నగూర్చుండి) మామయ్యా! (అని యేడ్వదొడంగుదురు)

బుడ్డన్:—(ఇంటికి సీలువేసి జీవన్‌లాల్‌తో కూడి వెళ్లును.)

దినకర్:—అమ్మా! తాతయ్య పలుకడే మమ్మా?

చంద్ర:—(కన్నులు(దెరచును)

ప్రభ:—అమ్మా! తాతయ్య కండ్లు దెరచినాడమ్మా.

చంద్ర:—(దాహమని సైగ జేయును)

శ్రీదేవి:—అయ్యో! నీటికి కరువయ్యెనే.

దినకర్:—ఉండమ్మా. నేను తెస్తాను. (అనిపరుగిడి పోవును.)

(తెర(వ్రాలును.)

ఇది ద్వితీయాంకము.

---



# త్రాగుడుపిడుగు.

## తృతీయాంకము.

### ప్రథమ రంగము.

ప్రవేశము:—సారాదుకాణమునకు దగ్గఱనుండు దారిలో నిలువఁబడి డబ్బులేని డాక్టరు కేశవశాస్త్రి దారినబోవు వారిని, తక్కిన తాగుబోతులను యాచించు చుండును.

డాక్టరు:- తే. గీ. సీమసారాయమును ద్రావి ♦ చిందు ద్రాక్ష
నాటుసారాయి తెగద్రావి ♦ నాట్యమాడి
కడకుఁ బోనుందుమున్ముందు ♦ కల్లుపాక
జేర, దమ్మిడీలేనట్టి ♦ కారణమున.

రామన్న:—(తాగుటకు వెళ్లుచుండును)

డాక్టరు:—అన్నా! ఒక అరడ్రాంసారాయి పోయిస్తావ్.

రామన్న:—ఇదో రెండణాలు. తాగుదురా (అని క్రింద వేసి పోవును)

డాక్టరు:—నీవు పోతావుంకుము. ఇద్దో ఇప్పుడేవస్తి (తనలో) ఈరెండణాలేమి చాలును. కడకి పూటకొక రూపాయి అయినాకావాలె. ఇంకొకరు వచ్చుచున్నట్లున్నది. అడిగి చూచెద. ఇచ్చునోలేదో.

ప్రవేశము:- నారపురెడ్డి.

నా. రెడ్డి:—(డాక్టరునుచూచి) ఏం డాక్టరో యీడుండావ్ ఎవరు నేర్పిరయ్యా నీకు తాగేది బంగారట్లాటి కాపురాన్ని బట్టులేపితివి.

డాక్టరు:—రెడ్డిగారూ! డాక్టర్లకు త్రాగుడు, లంకుతనము ఒకరు నేర్పవలసిన పనిలేదు. డాక్టర్లలో నూటికి తొంబది భాగములు త్రాగుడుబోతులు వ్యభిచారులు నైయుందురు. నేను అన్నివిధముల చెడినాను ఇంక బాగుపడను. ఒక అర డ్రాం సారాకు డబ్బిస్తావా ?

నా. రెడ్డి:—పో డాక్టరో. పూటకూలియింట్లో బువ్వపెట్టిస్తా గాని సారాయికి మాత్తరం లెక్క నేను చచ్చినా యిచ్చే టోన్ని కాదు. ఏం వస్తావా పోదాంమరి.

డాక్టరు:—ఇపుడు అన్నమక్కరలేదు. త్రాగి నానకవస్తాను.

నా. రెడ్డి:—తాగొచ్చే అన్నంకాదు, సున్నంకూడా పెట్టను.

డాక్టరు:—నీయిష్టం.

నా. రెడ్డి:—ఔరా! పాడుకాలం ఇట్లాంటిసావుకార్లే కడకు ఇట్లాఅయితే ఇంకబీదోల్లల్లో తాగేటోల్ల గతియేంకావాలె. ఈకాంగ్రెసుపోల్లు తాగొద్దు తాగొద్దు అనడమేకాని, సర్కారోల్లను కల్లుసారాయి బంగాకు నల్లమందు అంగళ్లకు యిజారా యియ్యకుండా చేయరాదూ? ఇన్నాళ్లూ

తెల్లోనిమీందబడి చచ్చారే, ఇపుడు సొదేశం మంతుర్లు చేయగూడదా. అంతాప్పై మాటలే. నేనల్లామంతిరన్నైంటే సారాయి కల్లంగల్లను నిలువుగు కాల్చించి వుందును. చేత గాని నాకుక్కల్‌ను కౌంసిల్‌కు ఓటిచ్చి పంపిందిమాత తప్పే లే. (అనిపోరును)

ప్రవేశము:- రామారావు.

రామా:—(దారిన బోవుచుండును.)

డాక్టరు:—మిత్రమా! దయయుంచి రెండణాలిచ్చెదవా?

రామా:—(మాటాడక వెళ్లుచుండును.)

డాక్టరు:—ఔరా! చిన్ననాటి స్నేహితుఁడే. కడకుతిరిగియైన చూడలేదే. వినఁబడెనో లేదో? (పరుగిడి) మిత్రమా మిత్రమా! (అని ఆపును)

రామా:—చీ తాగుడుబోతు కుక్కా పొమ్ము. (అని క్రిందం బడఁద్రోసి పోవును.)

ప్రవేశము:-బోడిశెట్టి

బో. శె:— (వచ్చుచుండును.)

డాక్టరు:—శెట్టిగారూ! ఈదిన మొక డ్రాం సారాయి పోయిస్తావా?

బో. శె:—దండాలు. రాండి పోదామూంట. డ్రాంకాదు నీ యిష్టమొచ్చినంతా తాగుదాం రాండి సామీ. అంతా

మీ లెక్కకే రాండి (అని యిరువురు దుకాణము కడకేగి త్రాగి మరలుచు) సామీ! జీవన్‌లాలుగాడు మీ యిల్లు జప్తిచేసినాఁడట. ఇంటికి లక్కమోరేసి మీనాయన్ను పెండ్లాం బిడ్డలను తరుముగొట్టినాఁడట. నీకుతెల్సునా లేదా?

డాక్టరు:—(కైపుతోఁ) ఆ - ఆ! నాయింటికీ బీగమేసి సీలువేసే మగవాఁడున్నాడా? వాన్ని నాశనం చేస్తాను. నేనెవరైంది వానికి తెలియదా? ఇపుడేపోయి సీలుపగులగొట్టి పారేస్తా. (అని తూఁగుచు పోవును.)

(తెరవాలును)

---

## ద్వితీయరంగము.

ప్రవేశము:—శ్రీదేవి మామగారి మరణమునకై బిడ్డలతోఁ గూడ దుఃఖించుచుండును. (దాసు గంగఁడు డాక్టరును త్రాగుడు మాన్పింతమని వత్తురు).

శ్రీదేవి:—(దుఃఖముతోఁ) మామగారూ! మమ్మందరను నడి సముద్రమున వదలి స్వర్గమునకేగితిరే. ఇఁక మాగతి యేమి. నాపతియు లేడాయె. ఆయన యుండిన కడకు దహన కృత్యములకైన తగిన సౌకర్యముల గావించి యుందురే. సకల భాగ్యములు గలిగిన మీకు, అకటా! మీశవమును గాల్చుటకు కట్టెలకు గరువయ్యేనే.

దిన:—అమ్మా! ఎందుకమ్మా ఏడుస్తావ్.

ప్రభ:—అన్నయ్యా! తాతగారు స్వర్గానికి పోయినారంటరా.

దిన:—ఏమమ్మా, ఇక్కడ పండుకొని నిద్రపోవు చున్నాడే. నీవు స్వర్గానికిపోయి నాడంటావు.

ప్రభ:—తాతగారికి జబ్బుకదా. స్వర్గానికి ఎట్లనడుస్తాడమ్మా? తాతయ్యగా రిక్కడుండే పోయినారని అబద్దాలాడ్తావా?

శ్రీదే:—మీమాటలకు నేను జవాబియ్యలేనమ్మా. తాతగారు చచ్చినారు. ఈ దేహాన్ని ఇంకం గాల్చవలసినదే అందులకు గట్టెలులేవు. మోయువారు మొదలేరాకున్నారుకదా!

పరివేశము - దాసు గంగండు.

దాసు:—రండు! హరిజనులారా మీమీ బయలు దేరండోయి! నాతో బయులు (అనుపాటను పాడి ముగించి శ్రీదేవిని చూచి) తల్లీ! డాక్టరుగారులేరా! ఈనిద్రించుచునదెవరు?

శ్రీదేవి:—అయ్యా! నాపతియింటికి వచ్చుటలేదు. అప్పుల వారు మమ్ము బయటికిం దరుమంగొట్టి, జప్తుచేసి గృహ మునకు సీలువేసిపోయిరి. మాకు అండగానుండిన మామ గారింతకు ముందే మరణించిరి. వీరిని సాగించుటకే డబ్బు లేని దీనావస్థలోనున్నాను.

దాసు:—అమ్మా! చంద్రశేఖర శాస్త్రిగారు చాలధనవంతు లని యనుకొనుచుండిరే. ఇట్టిస్థితిరానేల ?

శ్రీదేవి:—నాయనా! ఏమనగలను. నాభాగ్యరేఖ, యిట్టు లున్నది. త్రాగుడు అనుదయ్యము మాయిలుసొచ్చి సర్వ మును హరించినది. నాకునిలుచుటకు నీడలేకున్నది. మధు మహామారి భారతదేశము నావరించి భారతీయుల ధన మాన ప్రాణముల హరించుచుండ వేరుకారణ మేముం డును? నావంటి అబలలెందరిలాగు కుటుంబములం గోల్పోయి నిలువనీడ, త్రాగుటకొక గుక్కెడు గంజిలేక మలమల మాడుచున్నారో కదా.

దాసు:—తల్లీ! నీభర్త త్రాగుడు మరిగినాడని విని వారిని బాగుపరచుటకు వచ్చితిమి. అమ్మా! మనదేశమున భర్తల త్రాగుడువలన జెడిన సంసారములను లెక్కింప వీలులేకున్నది. ఒక్కొక్కరి కష్టములం జూచిన కడుపు రగులుకొని పోవును తల్లీ! మీరు దుఃఖింపవలదు. మీమా మయ్యగారికి దహనక్రియల జరిపించు యేర్పాటు మేము గావింతుము. మీరుబిడ్డలతో సేవాసదనమున నిర్భయముగ భారతమాతను సేవించు చుండవచ్చును. (గంగన్ననుజూచి) గంగన్నా! ఒకబండిని మాటాడి కట్టెలంగాటికిం బంపి నలుగుర బ్రాహ్మణులను పిలుచుకొనిరమ్ము.

గంగన్న:—మంచిదిసామీ! (అని పోం బ్రయత్నింప)

ప్రవేశము—డాక్టరు కేశవశాస్త్రి.

డాక్టరు:—(తూగుచు) ఎవఁడో మాయింటికి సీలు వేసినాడంట. వానికి పొగరా. వాణ్ణి చంపేస్తాను.

బిడ్డలు:—అమ్మా! నాన్న వచ్చేసినాడు.

శ్రీదేవి:—నాథా! మామగారు మరణించినారుకదా (అని దుఃఖముతో సమీపింపఁబోవును).

డాక్టరు:—ఊఁ-దూరంపో (అని వ్రేలితో సైగఁజేయును)

శ్రీదేవి:—అయ్యో నాథా! (అర్థోక్తి)

దాసు:—అయ్యో! ఎట్టివాడు ఏలాగు మారినాడు. వంటి నిండ గుడ్డలేదే! భగవంతా! మాకీ దుర్గతి యెప్పుడుతొలఁగ గలదు.

డాక్టరు:—(తూగుచుపోయి ముందు సీలును బిగమును బగులఁ గొట్టి పారవేసి దాసునుజూచి) ఏమిరా గాంధీటోపీడా! నాయింటికి సీలువేసినావా? (అని పైబడికొట్టును).

గంగన్న:—(అడ్డమురాగా వానిని తన్నుటకు మొదలిడును)

ప్రవేశము:—కోటయ్య ముస్తఫా అను పోలీసువారు వత్తురు.

కోట:—ఏమయ్యా! తాగి సర్కారు సీలు పగులఁగొట్టి అందఱను గొట్టుచున్నావు.

దాసు:—అయ్యా! కొట్టలేదు. నేను వానిని బాగుపరచెదను. మీరూరకుండుఁడు.

ముస్తః—క్యాసామీ! దెబ్బల్‌కీ యిస్తాంటే మాకీ చుస్తా వుండాం. క్యామారానై అంటావ్. డకల్ రే స్టేషన్‌కు బాప నోడు అంటా. అఖల్ లేదూ యేమయ్యా.

కేశవ:—(తూగుచు) అరేసాయబుగా-నీది గడ్డం పీకియేస్తా.

(అని గడ్డమును బట్టపోవును)

ముస్తః—(ఒక లెంపకాయ యిచ్చును.)

డాక్టరుః—(క్రిందబడగా సంకెళ్ళు వేసికొని పోవుచుండ)

శ్రీదేవి:—అయ్యో! నాభర్తను విడువుడు. మీకు పుణ్యమగును.

(అని వెంటబడగా)

కోటయ్య:—కాదుపో అమ్మా (అనిపోదురు)

శ్రీదేవి:—(మరలివచ్చి) అకటా! కడకెట్టి దృశ్యమును జూడనయ్యెను. సర్వేశ్వరా! ఈ త్రాగుడును లేకుండ జేయు పుణ్యపురుషుని సృష్టింపరాదా! ఔరా! నాభర్త నేమిచేయుదురో కదా.

దిన:—అమ్మా! నాయనగారికి జబ్బేమున్నా. పాపము నిలువ లేకుండెను.

శ్రీదేవి:—జబ్బుకాదు తండ్రీ! దయ్యము పట్టినది.

దాసు:—అమ్మా! మీరు గంగన్నవెంట సేవాసదనమునకు వెళ్లుడు. నేను బ్రాహ్మణులను రావించి యిక్కడి పనులను

ముగింతును. శవమును సాగించుటకు ముందు మీవార్తఁ బంపెను. మీరు రావచ్చును. బిడ్డలు అన్నములేక బాధ పడుచున్నారు. గంగన్నా! వీరిని సేవాసదనమున వదలి యేర్పాటుఁగావించి, పిదప నేజెప్పిన పనులఁజేయుము.

శ్రీదేవి:—అయ్యో! మామగారిని విడిచి పొమ్మంపురా.

దాసు:— మీ మామగారు లేరమ్మా. అది తోలుతిత్తి. ఇఁకఁ గొంతసేపుండిన వాసన బట్టును. తల్లీ! ధైర్యము వహించి వెళ్లుము. ఇక మీకు జయము గలుగును.

గంగ:—అమ్మా! నాతో రాండి. తల్లి ఏడుపొద్దమ్మా, ఏడిస్తే చచ్చినోడు వస్తాడా. పైన్నుండి చీటివచ్చింది పోయినాడు. చీటివస్తే మనమాత్రంతప్పిచ్చుకుంటామా. ఇదంతా దేవుని మాయ. (అని పిలుచుచుండ)

శ్రీదే:—అన్నా! శవమును సాగించునప్పుడు నేను లేకుండ రాదు. నేను బిడ్డలను విడిచి వస్తును. వారున్న భయపడు దురు. నేను వచ్చువరకు శవమును సాగింపకుము.

దాసు:—అలాగేనమ్మా!

శ్రీదేవి:—(గంగన్న) వెంట బిడ్డలతో (నిష్క్రమించును)

(తెర వ్రాలును)

ఇది తృతీయాంకము.



# త్రాగుడు పిడుగు.

## చతుర్థాంకము.

### ప్రథమరంగము.

ప్రవేశము-కల్లంగడిలో కల్లు, భంగు, మొదలగు మత్తు చేయువారు కూర్చుండియుందురు.

కంబన్న:—ఒరా కాటిగా సర్కార్లోల్లేమో చట్టం చేసిండా రంటరా.

కాటన్న:—ఏంజేచ్చేమునకేంరా. మనమూండాం కల్లుంది.

కంబన్న:—కల్లుసారాయి కొచ్చినతిప్పలేరా నేంజెప్పేది.

బింగోడు:—(భంగుతయారుజేయుచు) నాబంగాకు చిలిమికి తిప్పలురాదుకదా. అదేచాల్.

కంబన్న:—నీచిలిమి కొలిం గావాల్సిందే. నల్లమందుకు గూడా తిప్పలొచ్చిండి.

కాటన్న:—మనకల్లుకేం తిప్పలొచ్చిందిరా. కల్లుసారాయి అంగళ్ళు లేకపోతే సర్కారోని కథ జరగదే.

కంబన్న:—లేదన్నా! మనకాలం దగ్గరికొచ్చాంది. నెలా రొన్నెల్లల్లో కల్లు సారాయిభంగి, నల్లమంపు అంగళ్ళు మూసేచ్చారంట. ఇంక మనచావు కుక్కచావే.

బింగోడు:—నేనుమాత్తరం నాశక్తి వున్నంతా యిప్పుడే చూసుకుంటా. ఎనకెప్పైతాదో (అనిగట్టిగ ఈల్చును)

కాటన్న:—ఇదెన్నటికీకాదు. కల్లుసారా యంగళ్ళతోనే ఈకలిగ్గం జరగాలె. ఇది ల్యాకపోతే సర్కారోని పని సాగదు. ఇంక పోలీసోల్లకు, వకీల్లకు, అట్లనే యోచిచ్చే ఆ-ఆ-తాల్‌తాల్ అస్సల్ సాల్టోల్లకు నోట్లోమన్నే. ఇది కానిపనిలే. అబ్బే మాజట్టిస్ అయ్యగారి గొంతుల్లో వూపిరుంటే ఈపని జరగనియ్యరనుకో. ఆగాంధిమహాత్ముఁడు ఆతీరంగ పుత్తుకోని చచ్చాంటే వినేటోడుల్యా. సొదేశమోల్లొచ్చి కల్లంగటికాడ తాగొద్దని సెప్తాంటే పోటాకట్టెలపాలు చేసింది. నువు చూల్లేదా. జట్టిసోడు తాగొద్దనిచెప్పి అడ్డమొస్తే తన్నుతా తీసకపోయ్ కైదులో యెయ్యమనింటే కల్లంగళ్ళ లేకుండాచేసే మొగోడెవరాని.

కంబన్న:—అదంతా మరచిపోరా. జస్టిసోని జెట్టూ పీడావదలి పోయింది. ఇపుడు సొదేశమోలమాటంటే బలే జరుగు తాందంట. వాల్లేసంట యీచట్టంచేసింది. ఎవరుచేసినా కడాపటికి చచ్చేటోల్లం మనమే చూసుకో.

కాటన్న:—(యోజించి) అయితే ఇంగెట్లబ్బే. మంచి గండ మొచ్చెగదరా. (తలయూచి) ఊ - కానీలే అట్లనైతే యింగా మేలేలేరా. మనమే కల్లుగీసుకోచ్చు. సారాయి వండుకోచ్చు. మన లెక్క మిగిలిపోతాది. ఏదొచ్చినా మన మేలుకే అనుకోమన్నారు. పెద్దోల్లు-తెల్దూ.

(ప్రవేశము—రహిమాన్)

రహి—అరే కాటిహన్నా! కల్లూగీస్తామ్. కల్లుగీసేకి చెట్లు కాడ్కపోతే; నీకి చెట్లుకీకట్టి కత్తికి తీస్కాని నీకొందుకాడ గీచి నెత్తుర్ తీస్తార్. తెల్వాలేదూ. మన ఆటల్ గీటల్ సాగన్. ఏం తాగినా రొన్నాల్లే.

కంబన్న:—ఎట్లనైబూ! కల్లుసారాయి తాకపోతే బతికే దెట్టా?

రహి:—బతక్కపోతే సచ్చిపోరా. వాల్లకీముద్దా. ఓనై కంబన్నా! సేందిల్యాకపోతే నాకీ కష్టంవుండాది. ఎంతకష్టం ఐతేనేం మనమాట ఏమిసాగుతుందిబై. కల్లు సారాయి లోవుండే మజా తెల్సినోడైతే యీచట్టంకీ బనాయిస్తాడా?

తే. వె. సాయిబులకు సేంది ♦ సారాయి ల్యాకుంటె
భతికిపలములేదు ♦ బతకరాదు
సేందిపినేవాల ♦ సేర్తాదుమక్కాకి
సేందిపియానె తో ♦ సెడునుభాయి.

హమారా గురువుల్‌కీగురువుల్ యిట్లాసెప్పీవుంటే (అర్థోక్తి)

కాటన్న:—అదేం సైబూ! మాచాచ్చరాల్లో మా త్తరం రాయలేదనుకున్నావా.

ఆ. వె. భంగితాగినోడు ♦ బమ్మలోకంబేలు
కల్లు తాగినోడు ♦ యెల్లుపెక్కి
స్వర్గమంటుయెంత ♦ సారాయితాగితె
ఇనకతాపిరమ్మ ♦ యినుముయేమ.

కనుకో—. మా చాచ్చరాల్లో—ఆ—మాచాచ్చరాల్లో అంతా తాగమనిరాసింటే మనం తాగితే యేంతప్పొంది?

రహి:—అరె తప్పునై గిప్పునై. ఆరే జాకో పీయింగే (పోవుచు) ఆరే చిల్మీ! నువ్వూ రారా.

బింగో:—ఊ-ఎక్కైతె అక్కైతాడి పోదాం.

కంబడు:—ఈ బాపనోళ్ల మాటు జరగబట్టికదూ, యీ కల్లు సారాయికి తిప్పలొచ్చింది. ఈ బాపనోల్లు యేదచేసినా కంతానికి తెచ్చిపెడ్తారు. వాల్లు తాగకపోతే తాగకపోయిరి. మేం తాగుతాంటే కడుపునొప్పెందుకు. ఇంత ఓర్చలేనితన ముండబట్టే యిపుడు కాపోల్లంతా బ్యామ్మల్‌ను తిట్టాండారు. పారిత్తాగి తమాసాచేసుకుందాం.

ప్రవేశము:—దాసు గంగన్న శ్రీదేవి తన బిడ్డలతోఁ గూడ ఖద్దరును ధరించి జండాలతో వత్తురు.

దాసు:—జయమహా! వందే భారతమాతా! ॥జయ॥

(అను పాటను పాడుచు, ఒకదానికొకటి సమీపమున నుండు కల్లు సారా దుకాణముల సమీపించి)

తే. గీ. ఆలుబిడ్డలు అన్నమో ♦ యనుచు నేడ్వ
కారు కన్నీటిధారలే ♦ కాక, మీరు
త్రాగునది కల్లు కాదన్న ♦ తగదు, కల్లు
సర్వమును హరియించెడి ♦ సర్వ హరియె.

సోమన్న:—(కల్లుబాన ముందు కూర్చుండి) సరే పోవయ్యా! నీపద్యాలు గిద్యాలు దూరంగాపోయి పాడుకో పో. ఈడ పాడ్తే నీజండాలెగిరిపోతాయ్.

రహీ:—ఏంనీ సామీ! ముతకబట్టల్కీ కట్టుకోని కల్లంగల్ల చుట్టు తిరిగే రాత రాసింది నీకి. పోపో. దూరంగా జావ్ జావ్.

కాటన్న:—ఒక ముంతకల్లేసుకో సామీ. కైలాసంకన పడ్తాది రా. కూకుందాంరా.

కంబడు:—ఆడసారాయుంది. ఈడకల్లుంది? నీయిట్ట మెచ్చింది తాగి పో.

శ్రీదేవి:—నాయనలారా! మీపాదములంటి వేడికొందును. వేలకొలఁది ధనముఁ గలిగి తూఁగుటుయ్యాలలో తూఁగెడి నాభర్త నేఁడు కారాగృహమున తినుటకు పిడచయన్నము లేక మ్రగ్గుచున్నాఁడు. ఆతని భార్యనగు నేనును, మా యిరువుర సంతానమగు ఈబిడ్డలను నిలువ నీడలేక, ఈ మహానుభావుని యండన జీవించుచున్నాము. మా యీగతికి కారణమేమో గ్రహించితిరా- ఈసారాయియే. ఈత్రాగుడే మాకొంపను నాశనమొనరించినది. మీరిచట త్రాగి చిందులు త్రొక్కుచుండ మీయింటిలో ఆలుబిడ్డలు గంజిలేక ఆకలికిఁ దాళఁజాలక చిందులఁ ద్రొక్కు సంగతి మీరెఱుంగరు. దయయుంచి త్రాగుడు మానిరండు.

బిడ్డలు:—అయ్యలారా! ఈత్రాగుడువలన మాతండ్రి మాకు దూరమైనాఁడు. ఇది చాల చెడ్డది. మీడబ్బు పోఁగొట్టుకొందురు. వీధులలో దొర్లి, అందఱిచేత ఛీ ఛీయని తిట్టించుకుందురు. కడపటికి మీప్రాణము కూడ పోవును. మీ పుణ్యమగును. మీపాదములఁబట్టి వేడికొందుము. మాకొఱకుగాదు. మీ ఆలుబిడ్డలకొఱకు త్రాగుడు మానుఁడు. మన దేశములో గంజి లేక మాడుచుండు ఆఁడువారి కోసము మా వంటి బిడ్డల బాగుకొఱకు త్రాగుడు మానుఁడు.

సోమన్న:—(తనలో) ఛీ-కల్లు అమ్మి ఇందటికి ద్రోహం జేయరాదు. ఏదైనా పనిజేసికొని బ్రతుకలేనా? (దాసును చూచి) స్వామీ! తెలియక నేనింతకాలం యీపనిచేసినాను. నీపాదాలంటి చెప్తాను. నేను కల్లును అమ్మను. త్రాగను. త్రాగుడుబోతులకు త్రాగుడు మానుడని మీావలెనే బోధస్తాను.

సూరన్న:—(నారాయి నమ్ముట చాలించి వచ్చి) మహానుభావా! నేటికి తెలివివచ్చినది. ఈపని చేయరానిదని తెలిసియు, ఎక్కడ పని దొరకనందున పదిరూపాయలజీతమున కాశించి యీపని జేయుచుంటిని. నేను త్రాగుడుబోతును కాకపోయినను, త్రాగుడును బోత్సహించినవారిలో జేరితిని. ఇకమీాద ఈ తల్లిపాదములాన నేనీపని జేయను.

కాటన్న } ల్సిందే. ఈ పిల్లోలకుండే బుద్ధి మనకు ల్యాకపాయను కద రా. ఛీ యీాకల్లొద్దు సారాయొద్దు. పాండి పాండి. యింటికి పోదాం. (అని దాసుముందు పాటను బాడుచు పోవుచుండ అందఱు వెనుక తాళము వేయుచుc బోదురు.)

## ద్వితీయరంగము.

ప్రవేశము:—జైలులో డాక్టరు కేశవశాస్త్రి పరితపించుచుండును.

డాక్టరు:- తే. గీ. సీమవిద్యల నేర్చితి ♦ స్త్రీలఁజేరి
సీమసారాల తెగద్రావి ♦ స్త్రీలగోలు
పోయి సారాయి కల్లుకై ♦ పోయి కడకు
జైలు జేరితి నరకంబు ♦ జేరఁబోదు.

ఇఁకనేను బ్రతికియు లాభములేదు. నాపై గొప్ప నేరము మోపఁబడియున్నది. తప్పద్రావి జనులను గొట్టినది కాక, సర్కారువారు వేసిన సీలును బగులఁగొట్టినందులకు నాకు కఠినశిక్ష తప్పదు. ఔరా! పవిత్రబ్రాహ్మణ వంశమున బుట్టిన నేను, ఎంతటి పాపినైతిని. భారతమాతకు నేను తీరాని కళంకమును దెచ్చితిని. ఈపాపి త్రాగుడు విద్యావంతులలోను విద్యావిహీనులలోను సహితము స్థావరము నేర్పరచుకొనుచున్నదే. పూతచరిత్రలగు స్త్రీలుగూడ త్రాగుడు నలవరచుకొనుచుండిరే. నేనిఁక జీవించిన భూమి భరింపఁజాలదు. తెలవారకముందే ప్రాణములఁ బాయవలయును. నాకుఁ గాపలాయుండు పోలీసువాఁడు ప్రక్కన తుపాకి నిడుకొని నిద్రించుచున్నాఁడు. దానినిమెల్లఁగఁదీసికొని ఆత్మహత్యఁ జేసికొనెదగాక. (అనితుపాకినందుకొని) నాసోదర

త్రాగుడుబోతులారా! మీకిదే నాకడపటి వందనము. నాయందు దయయుంచి మీరీస్థితికి రాకముందే త్రాగుడు మాని సుఖింపుఁడు. మీఆలుబిడ్డలకుఁ గడుపునిండ గంజి పోయుఁడు. అవతారపురుషుఁడనగు గాంధిమహాత్మా! నన్ను క్షమింపవలదు. నేను దేశద్రోహిని. నాసోదరీమణుల వేడి రక్తమును ద్రాగిన పాపిని. ఇదే నానమస్కారము. (అని కాల్చుకొనును)

ముస్తఫా:—(తత్తరపాటునలేచి) అరే నాయనా! బొమ్మన్ బంధూక్ నీ జలాలియాతోరే బాబా. నాదీపానం మీదిక్కలాయాతోరేబాబా. నాకీ చచ్చేకాం ఆయా.

ప్రవేశము:—సబ్ యిన్ స్పెక్టర్ నాయుఁడు.

నాయుఁడు:—అరేముస్తఫా! ఎక్కడరా తుపాకిశబ్దం.

ముస్త:—(వడకుచు) హాప్పా!- హాప్పా! మాటాడలేకుండును.

నాయు:—ఎందుకురాభయం. జరిగినదేమో చెప్పుము. భయపడొద్దు.

ముస్త:—అప్పా! నాదీదోసం నై అప్పా. ఇంతసేపు యీడనే పహరా యిస్తావుంటినిఅప్పా. మీరు వచ్చేకాడిక్కె ముందు నాకీ పిషాబ్కివస్తే పోతీమారాజ్. అదిచూచి యీ బొమ్మన్ తుపాకీ అందూకోని జలాలీయా. (చేతులఁద్రిప్పుచు) అయిపొయింది. చచ్చిపోయినాడూ సామీ.

దో మినిట్ మే యెంతా కాం జరిపినాడు. ద్యావరా. నాకీ మాఫ్ కరో. మారాజ్ జోరూ బిడ్డలుండేటోని సామీ (పాదములపైఁబడును.)

నాయు:—(యోజించి) సరి ఆత్మహత్య గావించుకొన్నాడని రిపోర్టు చేయుదును. పీనుఁగును ఆసుపత్రికిఁబంపుము.

ముస్త:—అచ్చా మారాజ్. అల్లా భతికితిం భతికితిం. అరే బాబా గండంకీ తప్పిపోయింద. నాయుఁడు మారాజ్ బహుత్ అచ్చా ఆద్మీహై. నైతో నాటిగొంతుకీ గాలం పడివుండా. (తెరవ్రాలును.)

నాయు:—(దారినబోవుచు) పాపము. అన్యాయముగ ఆత్మహత్య జేసికొనియున్నాడు. ఒకవేళ అతని భార్యయు బిడ్డలు వచ్చిననేనేమని చెప్పవలెను? (యోజించి) ఏమున్నది. జరిగిన సంగతిఁజెప్పి పీనుఁగుఁగూడఁ బూడ్పఁబడినదని చెప్పిపంపెద.

ప్రవేశము:—దాసు, గంగన్న, శ్రీదేవి, బిడ్డలు, నాయుఁడుగారికి యెదురుగ వత్తురు.

దాసు:—నాయుఁడుగారూ! వందనములు.

నాయు:—ఓహో దాసుగారా! క్షేమమా! ఎచటికేగుచుంటిరి. ఈమె యెవరు. ఈబిడ్డలు మీకేమగుదురు.

దాసు:—ఈమె శ్రీదేవిగారు తాతాగృహమునుండు డాక్టరు గారిసతి. అబిడ్డలు సంతానమే.

నాయు:—(బిడ్డల రెండుచంకల నెత్తికొని) దాసుగారూ! చెప్పుటకు నోరురాకున్నది. అయిన చెప్పకతీరదు. ఈ బిడ్డలు తండ్రిలేనివారైనారు. (అనిదించును).

శ్రీదేవి:—ఆ-ఆ-నిజమా నాభర్త నాకులేఁడా ఏమాయెను. అన్నా దయయుంచి చెప్పుము.

నాయు:—సోదరీ! నిజమమ్మా ఆత్మహత్యఁ గావించుకొన్నాడు. శవపరీక్షయు, శవమును బూడ్చుటయుఁగూడ ముగిసినది. తల్లీ మనమేమి చేయఁగలము. త్రాగుడు మహామారియై అతని ధనమాన ప్రాణముల సర్వమును హరించెను.

శ్రీదేవి:—హా! నాథా! (అనిమూర్ఛిల్లును.)

నాయు:—దాసుగారూ! ఆమెకు ధైర్యముచెప్పుడు. నేడు వెళ్లవలెను. (పోవును)

బిడ్డలు:—(శ్రీదేవిప్రక్కనగూర్చుండి) అమ్మా! అమ్మా! (అనిపిలుతురు.)

దాసు:—సోదరీ! భయపడకుమమ్మా. ఇది దైవసంకల్పము తల్లీ.

శ్రీదేవి:—(మెల్లఁగలేచి) అన్నా! మాకథకడకిట్లు ముగిసినది. వీనికి మనము వగచి లాభములేదని తెలియును. నాకు మరణము కలుగకపోయెనుగదా!

దాసు:—పిచ్చితల్లీ ! నీబోటి శ్రీదేవులకు అకాలమరణము సంభవించిన ఈదేశమునశింపదా. నీ ప్రబోధచే నెందఱు బాగుపడవలెనో నీనాథుని చరిత్రము ఎందఱ త్రాగుబోతులను నీతిపరులుగ మార్చివేయునో మనము చూడగలము. మనము దేశమునకుఁ జేయవలసిన సేవయెంతయో గలదు. నీవు దుఃఖించుచుఁ గూర్చుండిన నాకేమియుఁ దోఁచదు. మనము సంఘసేవకుఁ బూనుకొంటిమి. మన జీవితములు సంఘసేవతోనే ముగియవలయునులెమ్మా. ధైర్యలక్ష్మియే నీకు తోడు. త్రాగుడుమరగిన యన్నలారా !

తే. గీ. ధనముగడియించి కల్లుకై ♦ ధారఁబోసి
కైపు తలకెక్కదారిని ♦ గానలేక
మట్టిలోదొల్లి చీయని ♦ పరులుతిట్ట
బ్రతుకుమీ జీవనంబది ♦ పాడుగాదె!

ఇప్పటికైనను నిదురమేల్కొని త్రాగుడుమాని తరింతురుగాత.

గంగన ఆ. వె. కల్లుత్రాగినాను ♦ కడవలకొద్దినే
ఆలుబిడ్డలకును ♦ అన్నమిడక
దాసుగారుచెప్ప ♦ దానినేమానితి
సుఖముగలిగెమాకు ♦ జూడరయ్య.

అన్నలారా! తాగితే మాలలను మాలలంటారంట. తాగకపోతే గాంధిమహాత్ముని కంఠమందుండే కద్దరు మాల లంటారంట. మీరు ఏమాలలై తారో చెప్పండి. ముతకనూలును చేతి రాట్నములమీఁద వడికి చేతి మగ్గములమీఁద నేయు పనిమనకు పుట్టుకతోనే వచ్చింది. మేల్కొండి కద్దరు గుడ్డను తయారుచేయండి మనవంశ నాశన మొనరించు త్రాగుడునుమానండి. ఇదే నా దండాలు.

శ్రీదేవి తే. గీ. సోదరీమణులార నం • జూడరమ్మ
మగఁడు చెడుదారిబోయిన • మగువ(బతుకు
లిట్టులగుఁగాన మీరలు • పట్టుఁబట్టి
త్రాగుడునుమాన్ప బోధింపఁ • దలఁపరమ్మ.

మీరొక్కొక్కరును మీజీవితములో ఒక త్రాగుబోతు నైననుకడకు త్రాగకుండ మార్పగలిగినచో మీజన్మము తరించును. మీరు భారత నారీమణులను నామము సార్థకము జేసికొందురు గాత!

జా తీ య గీ త ము.

దిన:—

పల్లవి:—

జయమగు జయమగు భారతమాతా? పావని!

భారతమాయీ!

సర్వదేశములు! సర్వజలనిమల్! సర్వవాహినులునూ!
హిందుముసల్మాన్ క్రిస్తవసిక్కు జైనపారసికులూ
తమశుభనామ స్మరణాసలుపుచు నుండిరిమాత!
మంగళమగునూ మాయీ! శుభమగు శుభమగు
సూన్ృతవాణీ!

జననీభారతమాతా!

జయమా! జయమా! జయమా!

జయము జయము జయమా.

జననీ భారతమాతాకీ జై

ఇదిచతుర్థాంకము.

సంపూర్ణము.